ఎ. కుప్రీన్




# ఏనుగు

ఎ. కుప్రీన్

# ఏనుగు

చిత్రాలు: డి. బొరోవ్‌స్కీ

అనువాదం: రాచమల్లు రామచంద్రారెడ్డి



"ప్రగతి" ప్రచురణాలయం

మాస్కో



## 1

నాద్యా అనే పాపకు జబ్బు చేసింది. ఆమెకు చాలా కాలంగా తెలిసిన డాక్టరు మిహాయిల్ పెత్రోవిచ్ ఆమెను చూడడానికి రోజూ వచ్చేవాడు. ఒకోసారి ఆమెకు తెలియని డాక్టర్లు యిద్దరు ఆయనవెంట వచ్చేవాళ్లు. వాళ్లు ఆమెను వెలకిలా, బోర్లా తిప్పేవాళ్లు, ఆమె శరీరానికి చెవులు ఆనించి వినేవాళ్లు, కనురెప్పలు దిగలాగి చూసేవాళ్లు. యీ పరీక్షలు చేసేటప్పుడు

వాళ్ళ ముఖాలు గంభీరంగా పెట్టి, హుఁ, హాఁ అంటూ గంభీరమైన ధ్వనులు చేసి, యేదో చిత్రమైన భాషలో మాట్లాడుకునేవాళ్ళు.

పాప గదిలోనుండి వాళ్ళ హాలులోకి పోయేవాళ్ళు. అక్కడ అమ్మ వాళ్ల కోసం కాచుకొని వుండేది. అందరిలోకీ ముఖ్యుడుగా కనిపించే పొడవాటి, తల నెరసిన, బంగారు కళ్లజోడు డాక్టరు ఆమెతో చాలాసేపు గంభీరంగా మాట్లాడేవాడు. తలుపు మూయనందున మంచంమీద వున్న పాపకు యివన్నీ కనిపించేవి, వినిపించేవి. వాళ్ల మాటల్లో చాలా భాగం ఆమెకు అర్థం కాకపోయినా, వాళ్ళ తనను గురించి మాట్లాడుకుంటున్నారని ఆమెకు తెలుసు. అమ్మ యేడ్చి యేడ్చి యెరుపెక్కిన తన పెద్ద, అలసిన కండ్లతో డాక్టరువైపు చూసింది. వెళ్లిపోయేటప్పుడు ఆ డాక్టరు బిగ్గరగా అన్నాడు:

"ఆమెకు యెప్పుడూ విసుగు కలగకుండా చూడండి. ప్రతి కోరికా తీర్చండి."

"అయ్యో డాక్టర్! అదే సమస్య! ఆమె యేదీ కోరదు!"

"హుఁ... అయితే, జబ్బుపడక ముందు ఆమెకు యేవి నచ్చేవో ఆలోచించండి. బొమ్మలో... మిఠాయిలో...."

"డాక్టర్, ఆమెకు యేదీ యిష్టం లేదు."

"దేనిలోనైనా ఆమెకు ఆసక్తి కలిగించడానికి ప్రయత్నించండి... దేనిలోనైనా సరే.... నా మాట నమ్మండి. ఆమె సంతోషంగా, నవ్వుతూ వుండేటట్లు చేస్తే, అంతకు మించిన మందు లేదు. మీ పాపకు జబ్బేమీ లేదు, జీవితంపట్ల ఆసక్తి లేకపోవడం తప్ప. వస్తాను."

## 2

"బుజ్జీ, నీ కేమైనా కావాలా? చెప్పు, నాద్యా," అన్నది అమ్మ.

"వద్దమ్మా, నాకేమీ వద్దు."

"నీ బొమ్మలన్నీ యిక్కడికి తేనా? నీ బుల్లి కుర్చీలూ, టేబులూ, కప్పులూ, సాసర్లూ నీ మంచంమీద పెడదాం. బొమ్మలు కాఫీ తాగి, కాసేపు వాతావరణం గురించీ, తమ పిల్లల ఆరోగ్యం గురించీ కబుర్లు చెప్పుకుంటాయి."

"వద్దమ్మా.... నాకేమీ వద్దు... నాకు విసుగ్గా వుంది...."

"సరేలే, బుజ్జీ, బొమ్మలు వద్దులే. కాత్యానూ, జెన్యానూ పిలవనా? వాళ్ళు నీ స్నేహితురాళ్ళు గదా."

"వద్దమ్మా, వద్దు. నాకేమీ అక్కర్లేదు. నాకు యెంతో విసుగ్గా వుంది!"

"ఒక ముక్క చాకొలెట్ యివ్వనా?"

పాప పలకలేదు, వూరక దిగాలుగా మిద్దె కప్పుకేసి చూస్తూ పండుకుంది. ఆమెకు జబ్బేమీ లేదు. ఆమెకు జ్వరం కూడా లేదు, కానీ రోజురోజుకూ చిక్కిపోతూ, బలహీనవౌతూ వుండింది. తనకు యెవ రేమి చేసేదీ ఆమెకు పట్టలేదు, యేమీ కాబట్ట లేదు. వూరక అలా మంచంమీద రేయింబగలూ పండుకొని వుండేది, కదలకుండా, దిగాలుగా. యెప్పుడైనా ఒక అర్ధగంట సేపు నిద్రపోయేది. ఆమె కలులు కూడా వర్షాకాలంలో జడివాన లాగ యెంతకూ తెగకుండా, కాంతిహీనంగా, విషాదకరంగా వుండేవి.

తన గదిలోనుండి హాలులోకి పోయే వాకిలీ, హాలులోనుండి నాన్న గదిలోకి పోయే వాకిలీ తెరచి వుంచినప్పుడు, పాపకు నాన్న కనిపించేవాడు. నాన్న అటూ యిటూ పచారుచేస్తూ, సిగరెట్టుమీద సిగరెట్టు కాలుస్తూవుండేవాడు. యెప్పుడైనా ఒకసారి ఆయన పాప గదిలోకి వచ్చి, మంచంమీద ఒక వార కూర్చొని, మెల్లగా పాప పాదాలు నిమిరేవాడు. తరువాత హఠాత్తుగా లేచి, కిటికీ దగ్గరికి పోయేవాడు. యీలవేస్తూ వీధిలోకి చూసేవాడు, కానీ ఆయన భుజాలు కంపిస్తూవుండేవి. తరువాత ఆయన వడివడిగా చేతిగుడ్డతో యీ కన్నూ, ఆ కన్నూ తడుచుకొని, చిరాకు కలిగిందా అన్నట్లు తన గదికి వెళ్లిపోయేవాడు. అక్కడ మళ్లీ ఆయన పచారుచేస్తూ, సిగరెట్టుమీద సిగరెట్టు కాలుస్తూ వుండేవాడు.... గది పొగతో నిండిపోయి నీలంగా కనిపించేది.

## 3

ఒక రోజు ప్రొద్దున నిద్ర లేస్తూనే పాప మామూలు కంటె కాస్త ఉత్సాహంగా వుండింది. ఆమెకు యేదో కల వచ్చింది, కానీ అదేమిటో ఆమెకు గుర్తు రాలేదు. అమ్మ కన్నులలోకి ఆమె నిదానంగా నిలజూసింది.

''యేం కావాలి, పాపా?'' అని అమ్మ అడిగింది.

పాపకు హఠాత్తుగా తన కల జ్ఞాపకం వచ్చి, రహస్యం చెపుతున్నట్లు మెల్లగా చెప్పింది:

''అమ్మా... నాకు... యేనుగు కావాలి. బొమ్మ కాదమ్మా, యేనుగు.''

''సరే బుజ్జీ, యిప్పుడే తెప్పిస్తాను.''

అమ్మ వెళ్లి నాన్నతో చెప్పింది, నాద్యాకు యేనుగు కావాలని. నాన్న వెంటనే కోటు వేసుకొని, హాటు పెట్టుకొని, బయటికి పోయినాడు. అర్ధగంట తర్వాత ఆయన ముచ్చటైన బొమ్మ తెచ్చినాడు, చాలా డబ్బు ఖర్చుపెట్టి. ఆ పెద్ద, బూడిద రంగు యేనుగు బొమ్మ తల వూపేది, తోక ఆడించేది. యేనుగు వీపుమీద యెర్రటి బట్టా, దానిమీద బంగారు హౌదా వుండినాయి,

హౌదాలో ముగ్గురు బుల్లి మనుషులు వుండినారు. కానీ పాప ఆ బొమ్మవైపు యేమీ ఆసక్తి లేకుండా చూసింది, కప్పువైపూ, గోడలవైపూ చూసినట్లే. మాట్లాడినప్పుడు ఆమె కంఠంలో యే చలనమూ లేదు.

"ఊఁ హుఁ. నే నడిగింది అది కాదు. నాకు నిజమైన యేనుగు కావాలి, బతికిన యేనుగు. దీనికి ప్రాణం లేదు."

"ఒక క్షణం ఆగు, నాద్యా," అన్నాడు నాన్న. "దీనికి కీ యిస్తాను చూడు; నిజమైన, బతికిన యేనుగు లాగే వుంటుంది."

ఆయన దానికి కీ యిచ్చినాడు. అది తల వూపుతూ, తోక ఆడిస్తూ, కాళ్లు కదలించి మెల్లగా టేబుల్‌మీద నడవసాగింది. పాప కేమీ ఆసక్తి కలగలేదు. నిజాని కామెకు విసుగు కలిగింది. కానీ, నాన్నకు ఆశాభంగం కలగకుండా ఆమె మెల్లగా, వినయంగా అన్నది:

"బాగుంది, నాన్నా. యింత అందమైన బొమ్మ యెవరికీ వుండ దనుకుంటాను. కానీ... నాన్నా, నన్ను సర్కస్‌కు తీసుకపోతాననీ, నిజమైన యేనుగును చూపిస్తాననీ యెప్పుడో చెప్పినావు, గుర్తుందా? మరి, తీసుకెళ్లనే లేదు."

"చూడు, బంగారూ, అది యెంత కష్టమో ఆలోచించు. యేను గంటే చాలా పెద్దది. మన మిద్దె కప్పు యెత్తు వుంటుంది. మన యింట్లో పట్టదు గదా.... అదీ కాక, యేనుగు నా కెక్కడ దొరకుతుంది చెప్పు?"

"ఓ, అంత పెద్దది వద్దు, నాన్నా, నాకు చిన్న యేనుగు చాలు, బతికిన దైతే సరి. యింత చిన్న దైనా సరే, నాన్నా... బెత్తెడు వున్నా సరే."

"అయ్యో, చిట్టి తల్లీ, నీ కోసం యేమైనా చేస్తాను. కానీ యిది నా చేతకాని పని. ఆకాశంలోని సూర్యుని పట్టుకరా, నాన్నా, అంటే యెలా వుంటుందో, యిదీ అంతే."

పాప విచారంగా చిరునవ్వు నవ్వింది.

"నీకు యేమీ తెలీదు, నాన్నా. నీవు సూర్యుని తేలేవని నాకు తెలీ దనుకున్నావా! సూర్యుడు కాల్చేయడూ నిన్ను? సూర్యునీ తేలేవు, చంద్రునీ తేలేవులే. ఓ, నా కొక చిన్న యేనుగు వుంటే యెంత బాగుండు – నిజమైన యేనుగు."

పాప కండ్లు మూసుకొని, గొణిగింది: "నాకు చాలైంది... నామీద కోపగించుకోకు, నాన్నా...."

నాన్న చేతులతో తల కొట్టుకొని, తన గదికి వురికినాడు. ఆయన అక్కడ కాసేపు పచారుచేయడం పాపకు కనిపించింది. తరువాత ఆయన చేతిలోని సగం కాలిన సిగరెట్టును నేలకేసి కొట్టి (అలాంటి పనికే అమ్మకు యెప్పుడూ కోపం వచ్చేది), పని మనిషికి కేకవేసినాడు:

"నా హాటూ, కోటూ పట్టుకరా, ఓల్గా!"

అమ్మ తలవాకిలిదాకా వచ్చి, అడిగింది:

''యెక్కడికి, సాషా?''

ఆయన గసపెట్టుతూ, కోటు గుండీలు పెట్టుకుంటూ వుండినాడు.

''నాకే తెలీదు.... యీ రోజు బతికిన యేనుగును నిజంగా పట్టుకొస్తాను.''

అమ్మ కంగారుగా ఆయనవైపు చూసింది. ''నీకు ఒళ్లు బాగలేదు కదూ? తల నొప్పిగా వుందా? రాత్రి నిద్ర సరిగా పట్టలే దనుకుంటాను.''

''నిద్రే పట్టలేదు,'' అన్నాడు ఆయన చిరాకుగా. ''నాకు మతి చెడిందా అని కూడా అడగబోతా విక. యింకా చెడలేదులే. వస్తాను. యీ సాయంత్రం లోపల యేదో ఒకటి తేలిపోవాలి.''

తలవాకిలి ధణామంది. నాన్న వెళ్లిపోయినాడు.

## 4

రెండు గంటల తర్వాత ఆయన సర్కస్‌లో ముందరి వరుసలో కూర్చొని, జంతువుల ఫీట్లు చూస్తూవుండినాడు. తెలివైన కుక్కలు యెగిరినాయి, పల్టీలు కొట్టినాయి, నృత్యం చేసినాయి, సంగీతానికి అనుగుణంగా మొరిగినాయి, పెద్ద అట్టలమీద రాసిన పదాలను పలికినాయి. కోతులు కొన్ని యెర్ర గౌన్లూ, కొన్ని నీలి షరాయిలూ తొడుక్కొని, తంతెమీద నడిచినాయి, పెద్ద కుక్కమీద స్వారిచేసినాయి. గొప్ప, గోధుమ రంగు సింహాలు మండే వలయాలగుండా దూకినాయి. ఒక సీలు పిస్టల్ కాల్చింది. ఏనుగులు చివరి రంగంలో వచ్చినాయి. అవి మూడు వుండినాయి, ఒకటి పెద్దదీ, రెండు చిన్నవీ. చిన్న యేనుగులైనా గుర్రంకంటె పెద్దవే. చూడడానికి అంత మొరటుగా, అస్తవ్యస్తంగా వుండే ఆ గొప్ప జంతువులు యెంతో లాఘవం గల మనుషులు కూడా చేయలేని మహా కష్టమైన పనులు చేస్తూవుంటే, చూడడానికి వింతగా వుండింది. పెద్ద యేనుగు మూడిటిలోకీ తెలివైనది. అది మొదట వెనుక కాళ్లమీద నిలబడింది, తరువాత కూర్చుంది, తలమీద నిలబడి కాళ్లు పైకెత్తింది, కొయ్య సీసాలమీద నడిచింది, దొర్లే పీపామీద నడిచింది, అట్టలతో చేసిన పెద్ద పుస్తకంలోని పుటలను తొండంతో తిప్పింది, చివరన టేబుల్‌వద్ద కూర్చొని, మెడకు నాప్కిన్ కట్టుకొని, బుద్ధిమంతుడైన పిల్లవానిలాగా భోంచేసింది.

సర్కస్ అయిపోయింది. ప్రేక్షకులు యిండ్లకు పోతూవుండినారు. నాద్యా నాన్న సర్కస్ యజమాని అయిన లావుపాటి జర్మన్‌వాని దగ్గరికి పోయినాడు. అతను పెద్ద, నల్లని చుట్ట పండ్ల మధ్యన కరచుకొని, తన టేబుల్‌వద్ద నిలుచుకొని వుండినాడు.

''క్షమించండి,'' అన్నాడు నాద్యా నాన్న. ''మీరు స్వల్ప కాలంపాటు మీ యేనుగును మా యింటికి పంపడానికి ఒప్పుకుంటారా?''



జర్మన్‌వాని కండ్లు విప్పారినాయి. అతని నోరు తెరచుకుంది, చుట్ట నోట్లోనుండి జారిపడింది. అతను ముక్కుతూ వంగి, చుట్ట అందుకొని, మళ్లీ నోట్లోకి దూర్చినాడు. అప్పు డతను అన్నాడు: "యేనుగునా? మీ యింటికా? మీ రనే దేమిటో నాకు అర్థం కావడం లేదు."

మీకు ఒళ్లు బాగలేదు కదూ, అని అతను కూడా నాద్యా నాన్నను అడగబోయేటట్లు వుండినాడు.... కానీ నాన్న త్వరగా పరిస్థితి వివరించినాడు: తన ఒక్కగానొక్క కూతురు నాద్యాకు చిత్రమైన జబ్బు వచ్చింది. అదేమి జబ్బో డాక్టర్లే సరిగా చెప్ప లేకున్నారు. పాప మంచం పట్టి నెల అయింది, రోజురోజుకూ చిక్కిపోతూ, బలం కోల్పోతున్నది. ఆమెకు దేనిలోనూ ఆసక్తి లేదు, యేది చూసినా విసుగే, వూరక క్షీణించి పోతున్నది. ఆమెకు వినోదం కలిగించాలని డాక్టర్లు చెప్పినారు, కానీ యేదీ ఆమెకు సంతోషం కలిగించదు. ఆమె కోరే ప్రతి కోరికా తీర్చాలని డాక్టర్లు చెప్పినారు, కానీ ఆమె యేదీ కోరనేలేదు. యీ రోజు ఆమె నిజమైన బతికిన యేనుగును చూడాలని కోరింది. యీ కోరిక నిజంగా అంత అసాధ్యమైనదా?

తరువాత ఆయన జర్మన్‌వాని కోటు గుండీ పట్టుకొని, వణకుతున్న కంఠంతో అన్నాడు:

"చూడండి... మా పాపకు జబ్బు నయమౌతుందని నాకు దృఢమైన ఆశ వుంది. కానీ... కానీ... ఒక వేళ ఆమె జబ్బు



ముదిరి, ఆమె ప్రాణాని కేమైన అయితే? ఆలోచించండి: ఆమె చివరి కోరికను, చిట్టచివరి కోరికను తీర్చలేదనే బాధ నన్ను బతికి నన్నాళ్లూ హింసిస్తూవుంటుంది!''

జర్మన్‌వాడు ముఖం చిట్లించి, పరధ్యానంగా యెడమ కనుబొమను చుట్టతో గోక్కున్నాడు. చివరకు అతను అడిగినాడు: ''మీ పాపకు యెన్నేండ్లు?''

''ఆరేండ్లు.''

''హుఁ... మా లీజాకు కూడా ఆరేండ్లే.... మరి, యేనుగును తీసుకపోవాలంటే చాలా ఖర్చు అవుతుంది. దానిని మీ యింటికి రాత్రిపూట తీసుకపోవాలి, మళ్లీ మరుదినం రాత్రి వెనక్కి తెచ్చుకోవాలి. ఆ పని పగటి పూట చేయలేము గదా. జనం గుమికూడుతారు, పెద్ద ఆఖ్య అవుతుంది.... కనుక నాకు ఒక రోజు ఆదాయం పోతుంది. మీ రా నష్టం భరించాలి.''

''ఓ, తప్పకుండా భరిస్తాను. దాన్ని గురించి బెంగ పెట్టుకోకండి.''

''మరి, యేనుగును యింట్లోకి తీసుకపోడానికి పోలీసులు ఒప్పుకుంటారా?''

''అదంతా నేను యేర్పాటుచేస్తాను.''

''యింకొక్క ప్రశ్న: యేనుగును మీ యింట్లోకి రానివ్వడానికి మీ యింటి సొంతదారుడు ఒప్పుకుంటాడా?''

''ఒప్పుకుంటాడు, యిల్లు నాదే.''

''ఆఁ! అది మరీ మంచిది. యింకొక్క ప్రశ్న: మీరు యెన్నవ అంతస్తులో కాపుర ముండేది?''

''రెండవ అంతస్తులో.''

''హుఁ... అదంత మంచిది కాదు. మీ యింటికి విశాలమైన నిచ్చెన వుందా? కప్పు యెత్తుగా వుందా? ఒకపెద్ద గదీ, విశాలమైన వాకిండ్లూ, చాలా బలమైన నేలా వున్నాయా? యెందుకంటే, మా టామీ తొమ్మిదడుగులా నాలు గంగుళాల యెత్తు వుంది, పదైదున్నర అడుగుల పొడవు వుంది. దాదాపు రెండు టన్నుల బరువు వుంటుంది.

నాద్యా నాన్న ఒక క్షణం జవాబు చెప్పలేదు. తరువాత ఆయన యిలా అన్నాడు:

''ఒక పని చేద్దాం. మీరు నావెంట మా యింటికి రండి యిప్పుడు. అన్నీ ప్రత్యక్షంగా పరీక్షించండి. అవసరమైతే వాకిండ్లు పెద్దవి చేయిస్తాను.''

''అలాగే!'' అన్నాడు సర్కస్ యజమాని.

## 5

ఆ రాత్రి యేనుగును పాప యింటికి తీసుకపోయినారు.

యేనుగు తెల్ల గౌసెన వేసుకొని, తల వూపుతూ, తొండం ముదుచుకుంటూ, సాచుతూ, వీధి మధ్యలో గర్వంగా నడిచింది. పొద్దు పోయినప్పటికీ, పెద్ద గుంపు దానివెంట పడినారు. కానీ యేనుగు వాళ్లను ఖాతరు చేయలేదు; వందల కొలది మనుషులను చూడడం దానికి రోజూ మామూలే. ఒక అల్లరి కుర్రవాడు యేనుగుకు దగ్గరగా పోయి, చుట్టూ వున్నవాళ్లకు వినోదం కలిగించడానికి, వెకిలి చేష్టలు చేస్తూ గంతులు వేసినాడు. అప్పుడు మాత్రం యేనుగుకు కాస్త కోపం వచ్చింది.

అది తన తొండంతో ఆ కుర్రవాని టోపీ యెత్తి, ముండ్ల కంచెమీదికి విసరివేసింది.

ఒక పోలీసువాడు గుంపులోకి వచ్చి, అందరినీ బతిమాలినాడు: ''దయయుంచి, అందరూ వెళ్లిపొండి. అంత వింతగా యేమున్న దిక్కడ? బతికిన యేనుగులను వీధుల్లో యెన్నడూ చూడనట్లు!''

వాళ్లు యింటిని సమీపించినారు. తలవాకిలి మొదలుకొని, భోజనాల గదిలోకి పోయే వాకిండ్లన్నీ తెరచివుంచబడినాయి.



కానీ, నిచ్చెన వద్దకు వచ్చి యేనుగు ఆగింది. యేమి చేయడానికీ తోచక, అది కదలకుండా నిలబడింది.

‘‘దానికి యేదైనా తియ్యని తిండి పెట్టాలి,’’ అన్నాడు సర్కస్ యజమాని. ‘‘తియ్యని బన్ను లాంటిది... రా, టామీ! రా!’’

నాద్యా నాన్న పక్క నున్న దుకాణానికి పరుగెత్తి పోయి, పెద్ద, గుండ్రని కేకు తెచ్చినాడు. యేనుగు అదంతా తినడానికి సిద్ధంగా వుండింది, అట్ట పెట్టెతో సహా, కానీ దాని యజమాని పాతిక భాగం మాత్రం అందించినాడు. టామీకి దాని రుచి

నచ్చింది, మరొక ముక్క కోసం అది తొండం సాచింది. కానీ యజమాని చాలా తెలివిపరుడు. అతను సాచిన చేతిలో కేకు పట్టుకొని, నిచ్చెనమీద వెనక్కి యెక్కినాడు. యేనుగు తొండం సాచి, చెవులు ఆడిస్తూ అతనివెంట నడిచింది. నిచ్చెన అంతా యెక్కిన తర్వాత అతను టామీకి మరొక ముక్క కేకు యిచ్చినాడు.

యీ విధంగా యేనుగును భోజనాల గదిలోకి తీసుకపోయినారు. అక్కడి ఫర్నిచరంతా అంతకు ముందే తొలగించబడి, నేలమీద దట్టంగా గడ్డి పరచబడి వుండింది. నేలలో బిగించబడిన గొలుసుతో యేనుగు కాలు కట్టివేసినారు. తాజా కారట్లూ, కాబేజీ, టుర్నిప్‌లూ దానిముందర పెట్టినారు. దాని యజమాని పక్కనున్న సోఫామీద పండుకున్నాడు. అప్పుడు దీపాలు ఆర్పివేసి, అందరూ నిద్రపోయినారు.

## 6

మరు దినం ప్రొద్దున పాప నిద్ర లేచిన వెంటనే అడిగింది: ''యేను గేదీ? వచ్చిందా?''

''వచ్చింది, తల్లీ,'' అని అమ్మ జవాబు చెప్పింది. ''కానీ, నీవు ముందు ముఖం కడుక్కొని, ఉడికిన కోడిగుడ్డు తిని, వేడి పాలు తాగాలని యేనుగు చెప్పింది.''

''యేనుగు మంచిదా?''

''ఓ, చాలా మంచిది. ముందు తిను, బుజ్జీ. వెంటనే వెళ్లి యేనుగును చూద్దాం.''

''అది చిత్రంగా వుందా?''

''కాస్త చిత్రంగానే వుంది. స్వెట్టరు వేసుకో.''

కోడిగుడ్డు తిని, పాలు తాగిన వెంటనే నాద్యాను పిల్లల బండిలో కూర్చోబెట్టి, భోజనాల గదిలోకి తీసుకపోయినారు. నాద్యాకు కాళ్లు రాకముందు ఆమెను బయట తిప్పడానికి ఉపయోగించిన బండి అది.

నాద్యా యేనుగు బొమ్మలు చూసి ఊహించినదానికంటె ఆ యేనుగు చాలా పెద్దది. అది దాదాపు వాకిలి యెత్తు వుండింది, భోజనాల గది పొడవులో సగం ఆక్రమించింది. దాని చర్మం చాలా కరకుగా, ముడుతలు పడి వుండింది. దాని కాళ్లు స్తంభాల లాగ లావుగా వుండినాయి. దాని పొడవాటి తోక చివరన కుచ్చు వుండింది. పెద్ద చెవులు వ్రేలాడుతూ, చేటల లాగ వుండినాయి. దాని కన్నులు చాలా చిన్నవి, కానీ తెలివితేటలు ఉట్టిపడుతూ, దయగా వుండినాయి. దాని దంతాలు కోసివేసినారు. పొడవాటి పాము లాంటి తొండం చివర రెండు రంధ్రాలూ, వ్రేలు లాగ కదలే చర్మపు పొర వుండినాయి. యేనుగు తొండం పూర్తిగా సాచితే, కిటికీ తాకేటట్లు వుండింది.

పాప యేమీ భయపడలేదు, కానీ అంత పెద్ద జంతువును చూసేటప్పటికి కాస్త స్తంభించింది. పాప నర్సు, పదారేండ్ల పోల్యా జడుసుకొని, కెవ్వున కేకవేసింది.

యేనుగు యజమాని నాద్యా దగ్గరికి పోయి, ''నమస్తే, అమ్మాయిగారూ. భయపడకండి. టామీ చాలా మంచిది, పిల్లలంటే దానికి యెంతో యిష్టం,'' అన్నాడు.

పాప తన చిన్న, పాలిపోయిన చేయి జర్మన్‌వానికి అందించి, అన్నది: ''నమస్తే. నా కేమీ భయం లేదు. దీని పేరే మిటి?''

''టామీ.''

''నమస్తే, టామీ,'' అంటూ పాప తల ఆడించింది. ''నిద్ర బాగా పట్టిందా?''

పాప చేయి కూడా అందించింది. యేనుగు తన బలమైన తొండంతో ఆ చేతిని జాగ్రత్తగా పట్టుకొని, ఆ చిన్న, పల్చని వేళ్లను ఒత్తింది. డాక్టర్ మిహయీల్ పెత్రోవిచ్‌కంటె యేనుగు ఆ పని మృదువుగా చేసింది. అదే సమయంలో యేనుగు తల ఆడించింది, దాని చిన్న కన్నులు ముడుచుకపోయినాయి, నవ్వుతున్నాయా అన్నట్లు.

''దీనికి అన్నీ అర్థమౌతాయి కదూ?'' అన్నది పాప జర్మన్‌వానితో.

''అన్నీ ఔతాయి, అమ్మాయిగారూ.''

''మాట్లాడలేదు, అంతే గదూ?''

''అంతే నండీ. మాట్లాడలేదు. నాకు కూడా ఒక్కతే కూతురు వుంది, సరిగ్గా మీ యీడుదే. ఆమె పేరు లీజా. టామీకీ, లీజాకూ మంచి దోస్తీ. బలే దోస్తీ లెండి.''

''కాఫీ తాగినావా, టామీ?'' పాప యేనుగును అడిగింది.

టామీ మళ్లీ తొండం సాచి, పాప ముఖంమీద వెచ్చని గాలి వూదింది. పట్టు కుచ్చులలాంటి పాప జుట్టు గాలికి లేచింది.

నాద్యా కిలకిల నవ్వుతూ, చప్పట్లు చరచింది. జర్మన్‌వాడు హహ్హాహ్హా అంటూ బిగ్గరగా నవ్వినాడు.

యేనుగు లాగే అతను కూడా, పెద్దగా, లావుగా, దయగా వుండినాడు. యేనుగుకూ, అతనికీ పోలిక వున్నట్లు నాద్యాకు తోచింది. బంధువు లేమో!

''అదింకా కాఫీ తాగలేదు, అమ్మాయిగారూ. పానక మైతే దానికి నిజంగా యిష్టం. బన్నులు కూడా మహా యిష్టం.''

ఒక తట్టలో బన్నులు తెచ్చినారు. అందులో ఒకటి పాప యేనుగుకు అందించింది. అది వెంటనే తన వేలిని దానికి చుట్ట

బెట్టి, తొండంతో పైకి తీసుకపోయి, తలకాయకింద యెక్కడో దూర్చేసింది; అక్కడ వింతగా కనపడుతూ, ముక్కోణపు ఆకారంలో, బొచ్చు గల కింది పెదవి వుండింది. బన్ను యేనుగు కరకు చర్మానికి రాచుకోవడం నాద్యాకు వినిపించింది. టామీ అలాగే రెండవదీ, మూడవదీ, నాల్గవదీ, అయిదవదీ బన్నులు తినింది. అది కృతజ్ఞతతో తల ఆడించింది. దాని చిన్న కన్నులు సంతోషంతో యింకా చిన్నవైనాయి. పాప ఆనందంతో నవ్వింది.

బన్ను లన్నీ అయిపోయినాక, నాద్యా యేనుగుకు తన బొమ్మలు చూపించింది. "చూడు, టామీ, యీ అందమైన బొమ్మ సోన్యా. చాలా మంచి పిల్ల, కానీ సూపు తాగమంటే తాగదు. యిది సోన్యా కూతురు నతాషా. యీమె యిప్పుడిప్పుడే బడికి పోతున్నది, ఓనమాలు దాదాపు అన్నీ వస్తాయి. మరి యిదేమో మాత్ర్యోష్కా. యిది నా మొట్టమొదటి బొమ్మ. దీనికి ముక్కు పోయింది చూడు, తలకాయ అతుకు పడింది, జుట్టంతా రాలిపోయింది. కానీ యీ పాత బొమ్మను పారేయలేను గదా. యేమంటావ్ టామీ? యిది మొదట సోన్యాకు అమ్మగా వుండేది, యిప్పుడు మా వంటమనిషి అయింది. యిక, ఆడుకుందామా? టామీ, నీవు నాన్నగా వుండు, నేను అమ్మగా వుంటాను, వీళ్లు మన పిల్లలు."



టామీ ఒప్పుకుంది. అది నవ్వుతూ, మాత్ర్యోష్కాను గొంతు పట్టుకొని, నోటిదాకా యెత్తింది. కానీ సరదాకు మాత్రమే. అది బొమ్మను కాస్త నమిలి, మళ్లీ పాప ఒడిలో పెట్టింది. బొమ్మకు తేమ అయింది, కాస్త నలిగిపోయింది.

తరువాత నాద్యా దానికి బొమ్మల పుస్తకం చూపించి, చెప్పింది. ''యిది గుర్రం, యిది గోరెంక, యిది రైఫిల్... యిదిగో పంజరంలో పక్షి, యిది బక్కెటు, యిది అద్దం, యిది పొయ్యి, యిది పార, యిది కాకి.... చూడు చూడు! యిది యేనుగు! యిది యేనుగులాగ లేనేలేదు కదూ? యేనుగు లెప్పుడూ యింత చిన్నవి కాదు గదూ, టామీ?''

యేనుగు లెప్పుడూ అంత చిన్నవి కాదని టామీ ఒప్పుకుంది. అసలు దాని కా బొమ్మ ఒక్క పిసరు నచ్చలేదు. అది తన వ్రేలితో కాగితం అంచు యెత్తి, పుట తిప్పింది.

కాసేపట్లో భోజనం వేళ అయింది. కానీ నాద్యాను అక్కడినుండి తీసుకపోవడం సాధ్యం కాలేదు. అప్పుడు యేనుగు యజమాని ఉపాయం చెప్పినాడు: ''వుండండి. వాళ్లు కలిసి భోంచేసేటట్లు యేర్పాట్లు చేద్దాం.''

అతను యేనుగును కూర్చోమన్నాడు. అది బుద్ధిగా కూర్చుంది, నేల గడగడలాడింది, అలమారలోని ప్లేట్లు ధణధణ మన్నాయి, కింది అంతస్తు గదిలో కప్పుమీదినుండి పెళ్లలు రాలిపడినాయి. పాప యేనుగు కెదురుగా కూర్చుంది. యిద్దరి మధ్యా టేబుల్ పెట్టినారు. యేనుగు మెడకు టేబుల్ క్లాత్ చుట్టినారు. అప్పుడు మిత్రు లిద్దరూ భోజనం మొదలుపెట్టినారు. పాప కోడి సూపూ, కట్లెటూ తినింది. యేనుగు పచ్చి కూరగాయలూ, సలాడూ తినింది. పాపకు బుల్లి గ్లాసులో వైను యిచ్చినారు. యేనుగుకు ఒక గ్లాసు రమ్ కలిపిన వేడినీళ్లు యిచ్చినారు. అది గిన్నెలోని నీళ్లను ప్రీతిగా తొండంలోకి పీల్చుకుంది. తరువాత తీపు వచ్చింది: పాపకు ఒక కప్పు కోకో, యేనుగుకు సగం కేకూ. యీ కేకు జీడిపప్పు కేకు. వీళ్లు యిలా భోంచేస్తుండగా, పాప నాన్నా, జర్మన్‌వాడూ నాన్న గదిలో కూర్చొనివుండినారు. జర్మన్‌వాడు ఆనందంగా బీరు తాగుతూ వుండినాడు.

భోజనం తర్వాత నాన్న మిత్రులు కొందరు వచ్చినారు. వాళ్లకు భయం కలగకుండా వుండడానికి, మొగసాలలోనే వాళ్లతో చెప్పినారు, యింట్లో యేనుగు వుందని. మొదట వాళ్లు నమ్మలేదు, కానీ టామీని చూసిన తర్వాత వాళ్లు వాకిలివద్ద నక్కినారు.

''భయపడకండి! యేనుగు చాలా మంచిది,'' అని పాప చెప్పింది, వాళ్ల భయం తీర్చడానికి.

అయినా వాళ్లు వెంటనే పక్క హాలులోకి పోయి, కాసేపుండి వెళ్లిపోయినారు.

సాయంత్ర మయింది. కాసేపుంటే పాపకు నిద్ర వేళ అవుతుంది, కానీ ఆమెను యేనుగువద్దనుండి పక్కకు తీసుక పోవడం సాధ్యం కాలేదు. చివర కామె యేనుగు పక్కనే నిద్రపోయింది. అప్పు డామెను తన గదిలోకి తీసుకపోయినారు. ఆమెను మంచంమీద పండబెట్టడం ఆమెకు గుర్తే లేదు.

మరు దినం పాప మహా ఉల్లాసంగా నిద్ర లేచి, జబ్బుపడక ముందు యెలా కేకలు వేసేదో అలాగే తొందరపాటు కంఠంతో, అందరికీ వినిపించేటట్లు బిగ్గరగా కేకవేసింది: ''పాలు, అమ్మా, పాలు!''

అమ్మ సంతోషంగా పరుగిడుతూ వచ్చింది.

హఠాత్తుగా పాపకు నిన్న జరిగిందంతా జ్ఞాపకం వచ్చి, అడిగింది: ''టామీ యేదీ?''

అమ్మ వివరించి చెప్పింది, టామీకి పిల్ల లున్నారనీ, యింటికి పోకుంటే జరగదనీ, అందువలన యింటికి పోయిందనీ. టామీ నాద్యాకు నమస్కారాలు చెప్పి పంపిందనీ, నాద్యాకు జబ్బు నయమౌతూనే తనను చూడడానికి రమ్మని ఆహ్వానించిందనీ అమ్మ చెప్పింది.

పాప చిలిపి చిరునవ్వుతో అన్నది:

''టామీతో చెప్పమ్మా, నా కిప్పుడు జబ్బు నయమైందని!''



